# రవికిరణాలు



రవీంద్రనాథ్ ఠాగూర్

అనువాదం;

స్వర్ణ రాజ హనుమంతరావు

ఖండవిల్లి సాంబశివరావు

జయంతి పబ్లికేషన్స్

బీసెంటురోడ్, విజయవాడ-2.



# రవి కిరణాలు

1

గ్రీష్మంలో దారితప్పిన పక్షులు తీయగా పాడటానికి పాడి పైకి ఎగిరిపోవటానికి నా గవాక్షానికే తెంచుత్తై.

పాడుటకు పాటలులేని శిశిరంపు పండుటాకులు తీవ్ర సంచలనంతో నిట్టూరుస్తూ నేలరాలిపోతై.

2

ఓ విశ్వసంచార సమూహమా! నా పదముల మీ పదాంకితము లొనరింపుడు.

3

ప్రపంచం ప్రియునికై తనగొప్ప మేలిముసుగును తొలగిస్తుంది.

అది ఒకగీతమువలె సూక్ష్మమై, నిత్యమైన ప్రణయ చిహ్నమౌతుంది.

4

ధాత్రీ దరహాసమును విరియజేయునది ఆమె యొక్క అశ్రుధారలే.

5

తన శీర్షమును చలింపజేయుచూ, నవ్వుచూ, ఉవ్వెత్తుగ నెగిరిపోవు గడ్డిపోచ ప్రేమకై విశాలపుటెడారి దగ్ధమౌతుంది.

6

సూర్యుణ్ణి చూడనందుకు కన్నీళ్ళు కారుస్తూవుంటే తారకలను కూడ దర్శింపలేవు.

7

ఉప్పొంగి ఉరకలిడే ఓ ప్రవాహమా! నీ మార్గములో వుండే సైకతములు నీ ఆటను, పాటను యాచిస్తున్నయ్. వాని అంగ వైకల్య భారాన్ని నీవు వహిస్తావా?

8

రాత్రికాలపు వర్షమువలె అపేక్షా పూర్ణమగు ఆమె వదనము నా స్వప్నములను వెంటాడుతుంది.

9

ఒకప్పుడు మనం పరాయివాళ్ళమని కలగన్నాం.

మనం పరస్పరం పరస్పరం ప్రేమగలవారమని తెలిసికొనుటకు మేల్కొన్నాం.

10

సద్దులేని వృక్షములలో సాయంసంధ్యవలె, దుఃఖము శాంతిలోనికి నాహృదయములో అణచి యుంచబడినది.

11

మందమారుతమువలె అదృశ్యపు ప్రటంగుళు లేవో, అలల సంగీతమును నా హృదయముపై ఆలపించుచున్నవి.

12

"ఓ నీరధీ! నీదే వాణి?"
"అవి నిత్య సమస్యా పూర్ణవాణి."
"అంబరమా! నీ ప్రత్యుత్తరమే భాష?"
"అభాష నిత్య మౌనంపు భాష."

13

హృదయమా! అది వేనిచేత నిన్ను ప్రేమిస్తున్నదో ఆ ప్రపంచపు గుసగుసలను ఆలకించు.

14

సృష్టియొక్క పరమరహస్యము నిశా తిమిరము వంటిది—అది ఉత్కృష్టమైనది. జ్ఞాన భ్రాంతి ప్రాతఃకాలపు పొగమంచు వంటిది.

15

ఉన్నతంగా వుందికదా అని నీ ప్రేమను నిట్టనిలువు ప్రదేశంపై అధిష్ఠింపచేయవద్దు.

16

ప్రపంచం మొక బాటసారివలె ఒక్కక్షణమాగి, నన్న భినందింపుచూ తల ఊపి వెడలిపోయే గవాక్షము కడ నేనీ ఉదయం కూర్చుంటాను.

17

ఈ అల్పమైన ఆలోచనలు ఆకుల మర్మరధ్వనులు అవి నామనస్సులో తమ ఆనందపు గుసగుసలు కలిగి యున్నై.

18

నీ వెవరో నీకుగోచరింపదు, నీకు గోచరించేది నీఛాయ.

19

నా వాంఛలు మూఢమైనవి, ప్రభూ! అవి నీ గీతములను కలకల మొనరించును.

అయినా నన్ను విననీ!

20

అత్యుత్తమమైన దానిని నే నెన్నుకొనలేను. అదేనన్ను ఎన్నుకుంటుంది.

21

వీపుపై లాంతరును మోసుకొని పోయేవారు వారి ముందు వారినీడలను ప్రసరింపజేసుకుంటారు.

22

నా ఉనికి అనేది శాశ్వతమైన విస్మయం. అదేజీవితం.

23

"మర్మరధ్వనిచేయు ఆకులమగు మేము పెనుతుఫానులకు ప్రత్యుత్తర మీయఁగల కంఠధ్వనిని కలిగియుంటే అంత

మౌనముగానున్న నీవెవ్వరు?"

"నేను కేవల మొక పుష్పాన్ని."

24

కనులకు కనురెప్పలవలె విశ్రాంతి కృషికి.

25

మానవుడు జన్మతః పసివాడు. అతనిశక్తి అభివృద్ధి యొక్క శక్తి.

26

భగవానుడు రవికొఱకు, భువికొఱకుగాక తాను పంపు పుష్పములకై సమాధానముల నాశించును.

27

నగ్నమగు బిడ్డవలె హరిత పత్రములనడుమ ఆనంద ముగా నాడురోచిస్సు మానవుడనృత మాడగలడని యెరుగదు.

28

సౌందర్యమా ! నీ పొగడ్తల దర్పణములో కాక ప్రేమలో నిన్ను నీవు తెలుసుకో !

29

ప్రపంచపు తీరమున నా హృదయము తనతరంగములు కొట్టి, దానిపై అశ్రువులతో "నేను నిన్ను ప్రేమిస్తాను" అను మాటలతో తన చేవ్రాలుంచును.

30

"నెల రాజా ! దేనికోసం నీవు వేచియుండటం ?"

"నేను మార్గమొసరించవలసిన సూర్యునికే అభివందన మాచరించుటకు"

31

మూగదియగు పుడమియొక్క ఆశాపూరితమగు వాణి వలె, వృక్షములు నాగవాక్షమునకు వచ్చును.

32

భగవానునకు, ఆయన ఉదయమ్మైలే ఆయనకు వినూత్న విసంభ్రమములు

33

జీవితం ప్రపంచంయొక్క హక్కులవలన తన సంపదను, ప్రేమాస్మాతవలన తన విలువను తెలుసు కుంటుంది.

34

తడియారిన నదీ గర్భము తన గతమునకేమీ కృతజ్ఞత నందదు.

35

పక్షి తానొక మేఘమై వుండాలి అని కోరుకుంటుంది. మేఘము తానొక పక్షినై వుండాలి అని కోరుకుంటుంది.

36

"నా స్వేచ్ఛను నేను పొందినపుడు నా గీతాన్ని నేను కనుగొంటా" నని జలపాతం పాడుతుంది.

37

మౌనంగా ఈ హృదయమెందుకు కృశిస్తుందో నేను చెప్పలేను.

అది అత్యల్ప అవసరాలనెన్నడూ అభ్యర్థించదు, ఎరుగదు. జ్ఞాపకముంచుకోదు.

33

వనితా! నీవు నీగృహసేవలో చరించునపుడు, గులక రాళ్ళలో ప్రవహించు సెలయేరువలె, నీ అవయవములు గీతము లాలపించును.

39

ప్రాచీదిశకు తన చివరి అభివందనను తెల్పి, సూర్యుడు పశ్చిమ జలధిని దాటటానికి వెళతాడు.

40

నీకు ఆకలిలేదుగనుక ఆహారాన్ని నిందింపవద్దు.

41

చెట్లు, భూమియొక్క గాఢవాంఛలవలె, స్వర్గమువంక తొంగి చూచుటకు జాగ్రుతములై యుండును.

42

నీవు చిరునవ్వు నవ్వి ఏమీ మాట్లాడావుకావు. దీని కోసరమే చిరకాలంగా వేచి యున్నానని అనుకున్నాను నేను.

43

నీళ్ళల్లో వున్న చేప మౌనంగావుంది, భూమి మీద వున్న జంతువు సద్దు చేస్తోంది, మరుద్విహార మొనరించే పక్షి పాడుతోంది.

కాని మానవుడు తనలో నీరధి నిశ్శబ్దాన్ని, వసుందరా సందడిని, మరుత్తరంగ సంగీతాన్ని కలిగియున్నాడు.

44

మెల్లనైన హృదయ తంత్రులమీదుగా విశ్వం విషాద సంగీతాన్ని ఆలపిస్తూ వేగంగా వెళ్ళి పోతుంది.

45

అతడు తన అయుధాలను దేవతలను చేశాడు.

అతని ఆయుధాలు జయించినప్పుడు అతడు తనంతట తనే పరాజితుడైనాడు.

46

భగవానుడు తన సృష్టిలో సాక్షాత్కరిస్తాడు.

47

ఛాయ తనయొక్క ముసుగును ధరించి, అనురాగ పూర్ణ నిశ్శబ్దగతుల, ప్రచ్ఛన్న వినమ్రతతో వెలుగును అనుసరిస్తుంది.

48

మిణుగురు పురుగులవలె అగపడుటకు తారకలు భయపడవు.

49

నేను శక్తియొక్క యే చక్రాన్ని కాక దానిచేత నలగగొట్టబడే ప్రాణి కోటిలో ఒకణ్ణాయి నందుకు నీకు నా కృతజ్ఞత.

50

సువిశాలంకాని సూక్ష్మ బుద్ధి అడుగడుక్కీ సందేహిస్తుందిగాని, ముందుకు సాగదు.

51

నీ ప్రతిమకంటే భగవానుని ధూళి ఎక్కువగొప్పదని రుజువు పరచటానికే నీప్రతిమ మట్టిలో ధ్వంసము చేయబడింది.

52

తన చరిత్రలో మానవుడు తనను తాను బహిరంగపరుచుకొనడు. దాని ద్వారా పెనుగులాడుతాడు.

53

మట్టి ప్రమిద తనను 'దాయదీ' అన్నందుకు గాజు బుడ్డి తిట్టుతూవుండగా చంద్రుడు పైకివస్తాడు; గాజుబుడ్డి మృదువుగా చంద్రుణ్ణి 'ఓ ప్రియాతి ప్రియమైన అన్నయ్యా' అని పిలుస్తుంది.

54

సముద్రపు కాకులు, కెరటాలు కలుసుకున్నట్లు మనం కలుసుకొని దగ్గరకు వస్తాం. సముద్రపుకాకులు ఎగిరి పోతై. కెరటాలు పనుగులిడతై. మనం విడి పోతాం.

55

నారోజు గడచింది. ఒడ్డుకు లాగబడి సంధ్యాసమయ తరంగ నృత్యసంగీతాన్ని వింటున్న పడవవలె ఉన్నానునేను.

56

జీవితం మనకీయ బడింది. ఇచ్చినకొద్దీ దానిని ఆర్జించుకుంటాను.

57

మనం వినమ్రతలో గొప్పవాళ్ళమైనప్పుడు గొప్పకు మనం చేరువవుతాం.

58

నెమలి పురిభారాన్ని గురించి పిచ్చుకకు విచారం.





59

కాలాన్నిగురించి ఎప్పుడూ భయపడవద్దు అని అమర వాణి పాడుతుంది.

60

గాలివాన దారీ తెన్నూ లేని మార్గాన దగ్గరదారికోసం వెతుకుతూ తన అన్వేషణను ఎక్కడకూ వెళ్ళకుండానే హఠాత్తుగా అంత మొందిస్తుంది.

61

మిత్రమా ! నా మధువును నాకలశంలోనే స్వీకరించు. ఇతరుల కలశాల లోనికి పోసినప్పుడు దాని నురగ కారి పోతుంది.

62

అపరిపూర్ణత్వంయొక్క అనురాగంకోసం పరిపూర్ణత్వం సౌందర్యంగా తననుతాను అలంకరించు కుంటుంది.

63

నిన్ను గాయ పరుస్తాను గనుక మన్నిస్తాను; దండిస్తాను కనుక ప్రేమిస్తాను" అంటాడు మానవుడితో.

64

వెలుగు నిచ్చినందుకు జ్వాలకు కృతజ్ఞత తెలుపు. కాని నిశ్చలమైన ఓర్మితో నీడలో నిలబడివున్న దీపపుసెమ్మెను మాత్రం మరచిపోవద్దు.

65

తృణమా! నీ పాదములు అతిసూక్ష్మమైనవి. అయినా నీ పాదములక్రిందకూడ భూమివుంది.

66

శైశవం దాటని పువ్వు తనదళములు విప్పుకొని "ప్రియమైన ప్రపంచమా! వాడిపోబోకు" అని అరుస్తుంది.

67

భగవానుడు అలసట చెందేది మహా సామ్రాజ్యాలను గురించికాని, అల్పమైన కుసుమాలగురించి ఎన్నడూకాదు.

68

అధర్మం ఓటమి సహింప జాలదు కాని ధర్మం సహింప గలదు.

69

"దాహముగొన్న వానికి కొంచెము జలము సరిపోయి నప్పటికిన్నీ, నా సర్వస్వాన్ని సంతోషంగా ఇచ్చివేస్తా" నని జలపాతం పాడుతుంది.

70

నిరంతరంగా రేకెత్తిన పరమానంద పారవశ్యంతో ఈ కుసుమములను పైకెగజిమ్మే దానికి మూలమెక్కడ?

71

కట్టెలు కొట్టేవాని గొడ్డలి తన పట్టుకొయ్య కోసం చెట్టును అర్థించింది.

చెట్టుదాన్ని ఇచ్చింది.

72

పొగమంచు, వర్షములతో ముసుగువేయబడిన, అనాథ సంధ్యా దుఃఖపుటనుభూతిని నేను నాహృదయపు ఏకాంతంలో పొందుతాను.

73

అపరిమితమైన అనురాగంనుంచి వచ్చుపాతివ్రత్య మొక సౌభాగ్యం.

74

పొగమంచు, ప్రేమవలె పర్వత హృదయములపై కేళి సలిపి సౌందర్య సంభ్రమముల కొనితెచ్చును.

75

మనం ప్రపంచాన్ని తప్పుగా అర్థంచేసుకొని అదిమనను మోసగిస్తోంది అంటాం.

76

తనవాణి నన్వేషించుటకు కవితా-పవనము మహారణ్యాముల మీదుగను, మహాసంద్రముల మీదుగను బయలు వెడలినది.

77

మానవుడంటే భగవానుడింకా నిరుత్సాహ పడలేదని సందేశంతో ప్రతిబిడ్డ ప్రపంచంలోకి వస్తుంది.

78

పచ్చిక భూమియందు సమ్మర్ధాన్ని అభిలషిస్తుంది. చెట్టు విహాయసపు ఏకాంతాన్ని అన్వేషిస్తుంది.

79

మానవుడు తనచుట్టూ తనేగోడలు నిర్మించుకుంటాడు.

80

మిత్రమా ! ఓపికగా వినే ఈ దేవదారు చెట్లమధ్యలో సముద్ర మంద్రధ్వనివలె, నీకంఠధ్వని నాహృదయంలో ఘూర్ణిల్లుతుంది.

81

తనయొక్క స్వల్పమైన అగ్నికణములు తారకలైన అతిమిరాంధకార అదృశ్యజ్వాల ఏమిటి ?

82

వసంత కుసుమాలవలె జీవితం, శిశిర పర్ణాలవలె జీవితం సుందరం కానీ.

83

మంచిచేయ దలచుకొన్నవాడు ద్వారము తట్టుతాడు. కాని ప్రేమతో చేయదలచుకున్న వానికి ద్వారములు తెరచే వుంటాయి.

84

మృత్యువులో అనేకులు ఏకమవుతారు. జీవితంలో ఒక్కడు అనేక మవుతాడు.

భగవంతుడు లేకపోతే మతం ఒకటవుతుంది.

85

కళాకారుడు ప్రకృతి ప్రేమికుడు. అందుచేత అతడామె ప్రభువు, బానిస.

86

"ఓ ఫలమా! నానుండి నీ వెంతదూరాన వున్నావు?"

"ఓ పుష్పమా! నేను నీ హృదయంలోనే దాగి వున్నాను."

87

పట్టపగలు చూపుకందక, అంధకారంలో భావానికందే దానికోసం ఈ ఆకాంక్ష!

88

"నీవు తామరాకు క్రిందవున్న ఒక పెద్దమంచుబొట్టువి, నేను దానిపైనవున్న చిన్నబొట్టుని" అంది మంచుబొట్టు సరస్సుతో.

89

కత్తిమొక్క పదునును రక్షిస్తున్నప్పుడు పిడి మొద్దుగా నుండుటకే తృప్తిపడుతుంది.

90

అంధకారమున ఆ ఏకత్వం ఒకేరీతిగా నగుపించును. వెలుగులో ఆ ఏకత్వం అనేకత్వముగా నగుపించును.

91

పచ్చికసహాయమున భూమితనను తాను ఆదరణమునకాస్పదమొనరించుకొనును.

92

పర్ణముల జననమరణములు అతివడిగల సుడిగాలులు. కాని ఆ సుడిగాలులుపోనుపోను తారకలమధ్య మెల్లగా కదలు విశాలవలయములు.

93

అధికారం ప్రపంచంతో "నీవు నా దానవు" అంటె
ప్రపంచం తనసింహాసనంపై దాన్ని బందీ చేసింది.
ప్రేమ ప్రపంచంతో "నేను నీదాన్ని" అంది.
ప్రపంచం దానికి తనయింట్లో స్వాతంత్ర్యాన్ని ఇచ్చింది.

94

పొగమంచు భూమియొక్క కాంక్షవలే వుంది.
అది తనుకోరే సూర్యుణ్ణే తను దాచుకుంటుంది.

95

హృదయమా! నిశ్చలంగావుండు. ఈ మహావృక్షాలు ప్రార్థనలు.

96

క్షణికమైన సద్దు నిత్యమైనభగవానుని సంగీతాన్ని అవహేళనచేస్తుంది.

97

ప్రేమ, మృత్యువు మరియు జీవిత ప్రవాహములపై తేలిసాగి, విస్మరింపబడిన యుగాంతరములగూర్చి నేను తల పోస్తాను; గడచిపోవటానికిగల స్వేచ్ఛానుకంపనాన్ని పొందు తాను.

98

నా ఆత్మయొక్క విచారము దాని వధువుయొక్క ముసుగు. రేయిలో తొలగింపబడటానికది వేచియుంటుంది.

99

నిజంగా అమూల్యమైనదేదో దానిని జీవితముతో కొనుటకు సాధ్యపడునట్లుచేసి జీవితనాశమునకు మృత్యువు యొక్క ముద్ర విలువనిస్తుంది.

100

ఆకాశంలో ఒకమూల వినమ్రతతో మేఘం నిలబడి వుంది.

ఉదయం దానిని వైభవంతో కిరీటాలంకృతను చేసింది.

101

ధూళి అవమానాన్ని స్వీకరించి మారుగా తన కుసుమాలను సమర్పిస్తుంది.

192

అట్టిపెట్టుకుందామని పువ్వులను ఏరుకుంటూ తచ్చాడకు. ముందుకు సాగిపో! ఎందుచేతనంటే నీ మార్గమంతటా పుష్పాలు వికసించుకొనే వుంటాయి.

103

వ్రేళ్లు భూమిలో అడుగునవున్న శాఖలు.
శాఖలు గాలిలోవున్న వ్రేళ్లు.

104

తన పూర్వపుగూడును వెతుక్కుంటూ బహుదూరపు గ్రీష్మ సంగీతం శిశిరముచుట్టూ రెక్కలు కొట్టుకుంటూ తిరుగుతుంది.

105

నీదగ్గర్నుంచే యోగ్యతలను ఎఱువుఇచ్చి నీ మిత్రుణ్ణి అవమానించకు.

106

పురాతన వృక్షముచుట్టూవున్న పాచివలె నామరహిత మగు దినములస్పర్శ నాహృదయాన్ని అంటిపెట్టుకొని వుంటుంది.

107

ప్రతిధ్వని తాను అసలైన దానిననిఋజువు పరచుకొనేందుకు మూలమును వెక్కిరిస్తుంది.

108

భగవానుని ప్రత్యేకానుగ్రహాన్ని గురించి వశిష్ఠువు డంబములుపలుకుతుంటే భగవానుడు సిగ్గుచెందుతాడు.

109

నా శోక వెలిగింపని దీపంవుంది కనుక నామార్గంమీద నా నీడే పడుతుంది.

110

మానవుడు తన మానవపురద్దీని అణచుకోవటానికి, రద్దీగావున్న సమ్మర్దములోకి వెళతాడు.

111

ఏమీ మిగలకుండ అయిపోవటంతో అంతమయ్యేది మృత్యువు. కాని అసలైన అంతం అనంతంలోవుంది.

112

సూర్యుడు నిరాడంబరమైన వెలుగు అంగీని వేసుకున్నాడు. మేఘములు అతిశోభాయమానంగా అలంకరింపబడ్డాయి.

113

తారకలను పట్టుకోవటానికి ప్రయత్నిస్తూ చేతులు పైకెత్తే పసిపిల్లల అరుపులవలె వున్నాయి పర్వతాలు.

114

అది ప్రేమింపబడలేదు గనుక సమ్మర్దములోను మార్గం ఏకాంతంగానే వుంది.

115

తన కుచేష్టలనుగురించి డంబములు చెప్పుకొనే అధి కారం, క్రిందకు రాలిపడే పండుటాకులచేత, సాగిపోయే మేఘ ములచేత నవ్వులపాలు గావించబడుతుంది.

116

రాట్నం వడకుచున్న స్త్రీవలె, పురాతనకాలపు పాటను చేనినో ఒక విస్మృతిభాషలో భూమి ఈరోజు పగలు ఝుంకారంచేసి వినిపిస్తోంది.

117

తృణము తాను ఏ ఘనమైన ప్రపంచంలో పెరుగు తుందో ఆ ప్రపంచమంత ఘనమైంది.

118

స్వప్నం తప్పకుండా మాట్లాడాల్సిన భార్య,
నిద్ర మౌనంగా భరించే భర్త.

119

ప్రొద్దుకూకుతున్న పగటిని రాత్రి ముద్దుపెట్టుకొని, దానిచెవిలో గుసగుసలాడుతూ "నేను మృత్యువును, నీతల్లి ని. నేను నీకు మళ్లీ వినూత్నజన్మను ప్రసాదించాలి" అంటుంది.

120

ప్రియురాలు దీపాన్ని ఆర్పివేసినప్పుడు ఆమె సౌందర్యం వలె, చీకటిరాత్రి ! నీ సౌందర్యాన్ని నేను భావిస్తాను.

121

సర్గిల్లే నా ప్రపంచంలో నేను భంగపాటునందిన ప్రపంచాలను మోసుకపోతాను.

122

మిత్రమా! నేను ఈ తరంగాల్ని వింటున్నప్పుడు, ఈ చెలియలికట్టపై ఎన్నో గంభీర సాయంసంధ్యలయందలి నీ మహోన్నత భావాలమహాన్ని నేను అనుభవిస్తాను.

123

నీటిలోఉన్న చేపను గాలిలోకి లాక్కెళ్ళటం భూతదయతో కూడుకున్న పని అని గరుడపక్షి భావిస్తుంది.

124

"జాబిల్లి వెన్నెల్లో నీ ప్రేమలేఖలను నాకు పంపుతున్నావు— వాటికి నా జవాబులను కన్నీటిబిందువుల్లో పచ్చికమీంద జారవిడుస్తున్నాను" అంటుంది నిశాకాంత సూర్యునితో.

125

మహాత్ముడు ఆజన్మ పసిపాపే! అతడు తన తనువు చాలించినపుడు ఆ పసితనాన్ని ప్రపంచానికి యిచ్చివేస్తాడు.

126

సమ్మెట పెట్టులుకాక, నీటియొక్క నృత్యమే, గులకరాళ్ళకు నిండుతనంకోసం గానంచేస్తుంది.

127

మధుపాలు పూలమీద వ్రాలి వాటిలో తేనెను ఆస్వాదిస్తాయి. వెళ్ళేటప్పుడు తమ కృతజ్ఞతాభివందనాలను ఝుంకారంచేస్తూ సమర్పిస్తాయి. ఆ పూలకు—గాని రసజ్ఞత ఎరుగని డాంబికమైన సీతాకోకచిలుక మాత్రం పూవులే తనకు వందనాలు అర్పించాలని ఆకాంక్షిస్తుంది.

128

యదార్థాన్ని సంపూర్తిగా చెప్పటానికి ఇష్టంలేనప్పుడు అలాఅని నిష్కపటంగా వెల్లడి అయిపోవటమే తేలిక.

129

"నీ నివాసం ఎక్కడ?" అని సాధ్యం, అసాధ్యాన్ని ప్రశ్నించింది. "చేతకానివాడి కలలలో..." అని అసాధ్యం జవాబిచ్చింది.

130

తప్పు లన్నిటికీ తలుపుమూసుకు కూచున్నావంటే నిజం బయటే మూసుకుపోతుంది.

131

నా హృదయాంతర్గత విషాదం వెనుక వేటివో కలకలం శ్రవణగోచరం అవుతూన్నది కాని దృష్టిగోచరం కావేదు.

132

విశ్రాంతియొక్క చురుకుదనమే పని.

సాగరంయొక్క నిశ్చలత, తరంగాల్లో చలిస్తూంటుంది.

133

ప్రేమించినప్పుడు పత్రము పూవుగా మారుతుంది. ఆరాధించినప్పుడు పూవు ఫలముగా మారుతుంది.

134

పైనున్న శాఖలను ఫలవంతంచేసినందుకు, నేలఅడుగున ఉన్న వ్రేళ్లు ఏ ప్రతిఫలాన్నీ అపేక్షించవు.

135

ఈ వర్షాసాంధ్య సమయాన, గాలికి కించిత్తయినా విశ్రాంతిలేదు. ఊగిపోతూన్న చెట్లకొమ్మలకేసిచూస్తూ, జగత్తులో సమస్త వస్తువులయొక్క ఘనతను పర్యాలోచిస్తూంటాను నేను.

136

వేళాపాళా లేకుండా చిమ్మచీకట్లో లేచిపోయిన రాక్షసిపిల్లలా అర్ధరాత్రిలో గాలివానలేచి ఆటపాటలు విజృంభించింది.

137

ఓకడలీ! తుపానుయొక్క ఒంటరి పెండ్లికూతురా! నీ ప్రియునివెంబడి వెళ్ళటానికైన కెరటాలను వృథాగా పైకి లేవనెత్తుతున్నావు!

138

“నేను నా నిరర్థకతకు సిగ్గుపడుతున్నాను.” అన్నది పదం, పనితో — “నిన్ను చూడగానే నేనెంత పనికిమాలిన పేదనో నాకు అర్థం అయింది...” అన్నది పదంతో పని.

139

మార్పుల సంపదే కాలం. గాని గడియారం తన శ్లేష కవిత్వంలో దానిని మార్పుగా మాత్రం ఉంచేసి సంపదకు మాత్రం సున్నాచుట్టింది.

140

వాస్తవికత తన దుస్తుల్లో యదార్థాలు చాలా బిగుతయినట్లు కనుగొంటుంది—

కల్పనలో మాత్రం ఆమె సులువుగా నడిచిపోతుంది.

141

ఓ బాటా! నేను ఇక్కడకు అక్కడకు ప్రయాణంచేసి నప్పుడు నీనుంచి చాలా అలసిపోయాను. గాని ఇప్పుడు నువ్వే నాకు ప్రతిచోటకూ మార్గం చూపెడుతూండగా, ప్రేమతో నీతో కలసిపోయాను.

142

తెలియని గాఢాంధకారంగుండా నాజీవితాన్ని నడిపించి తీసుకువెళుతూన్నది. ఒకటి ఆ చుక్కల్లోఉన్నదని నన్ను భావించుకోనీ !

143

ఓ లలితాంగీ! నీవు నీ వ్రేళ్ల సౌందర్యంతో నా వస్తువులను స్పృశించగానే, సంగీతంలా శాంతి స్వస్థతలు వెల్లివిరిసాయి.

144

శిథిలాలయిన సంవత్సరాలలో అతివిషాదస్వరం ఒకటి గూడుకట్టుకుని ఉంది.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను" అంటూ అది రాత్రిళ్లు పాడుతూన్న పాట నాకు వినబడుతూనే ఉంది.

145

మండుతూన్న అగ్ని తన జ్వాలనుచూపి దూరంగా ఉండమని నన్ను హెచ్చరిస్తుంది—

గాని బూడిదలో దాగున్న కొరివి నిప్పునుంచి మాత్రం నన్ను రక్షించు ప్రభూ!

146

నా నక్షత్రాలన్నీ ఆకాశంలో ఉండిపోయాయి.
నా చిన్న దీపం నా ఇంట్లో వెలగలేదు.

147

వ్యర్థప్రసంగాల ధూళి నీకుఅంటుకొంది—
మౌనంతో నీ అంతరాత్మను క్షాళితం చేసుకో

148

జీవితంలో ఖాళీలుఉండి పోతాయి. వాటిలోంచే మృత్యువుయొక్క విషాదగానం వెలువడుతోంటుంది.

149

జగత్తు తనకాంతి హృదయాన్ని ఉదయాన్నే తెరచింది.

ఓ నా హృదయమా! దాన్ని కలుసుకోటానికి నీ ప్రేమను వెంటబెట్టుకురా!

150

కదలుతూన్న ఈ కెంజిగురాకులతో నా ఆలోచనలు కూడా కదులుతున్నాయి.

ఈ సూర్యరశ్మి స్పర్శతో నా హృదయం పాటలు పాడుతోంది. అన్నివస్తువులతో కలసిమెలసి నింగిలోని నీలాల్లోకి, నిశీథిలోని చీకటి తలాల్లోకి తేలియాడుతూ పోవడంఅంటే నా జీవితానికి మహాసంతోషం.

151

సర్వేశ్వరుని మహత్తరశక్తి మందమారుతంలోనే ఉన్నదిగాని తుపానులోమాత్రం లేదు.

152

ఇదంతా కల. ఇందులో వస్తువులన్నీ చిందరవందరగా విడివిడిగా ఉన్నాయి. అవి నన్ను బాధతో అణగద్రొక్కేయి. గాని నేనునిద్రనుండి మేల్కొని చూసేసరికి అవన్నీ నీలో ఒకే చోటకలసిఉంటాయి. అప్పుడు నాకు హాయి సమకూరుతుంది.

153

"నా విధిని ఎవరు నిర్వహిస్తారు ?" అని అస్తమిస్తున్న సూర్యుడు అడిగేడు!

"ఓ నా ప్రభూ! నేను నిర్వహిస్తాను. నా శక్తివంచన లేకుండా !" అని సమాధానమిచ్చింది ప్రమిదదీపం.

154

పూవుమొక్క రేకులను ఊడదీసి పూవులోని సౌందర్యాన్ని ప్రోగు చేసుకుందామనుకుంటున్నావేమో ! అది అసాధ్యం !

155

నిద్రిస్తున్న పక్షులకు, గూడువలె, మౌనం, నీ కంఠస్వరాన్ని మోస్తూంటుంది.

156

మహాత్ముడు అల్పులతో కూడా నిర్భయంగా నడుస్తాడు. మధ్యరకంవాడు దూరంగా నుంచుండిపోతాడు.

157

రాత్రి రహస్యంగా పూలను వికసింపచేస్తుంది. అభివందనాలనన్నింటినీ పగటినే స్వీకరించనిస్తుంది.

158

అధికార దర్పం కృతఘ్నత క్రింద మనుష్యుల కుత్తుకలు బలిమిని నులిమి బలిగా స్వీకరిస్తుంది.

159

సంపూర్ణత్వం సిద్ధించి బ్రహ్మానందం అనుభవిస్తూన్నప్పుడు, శ్రమ ఫలాలను సంతోషంతో వదలివేయగలం.

160

వర్ష పునీటిచుక్కలు భూమిని ముద్దుపెట్టుకుంటూ రహస్యంగా ఆమెచెవిలో "ఓ అమ్మా! మేమంతా ఇంటిమీద బెంగపెట్టుకున్న నీ బిడ్డలం! స్వర్గంనుంచి తిరిగి నీ దగ్గరకు వచ్చేసాం" అన్నాయి.

161

సాలీడు హిమబిందువులను పట్టుకుంటూన్నట్లు నటిస్తూ మక్షికాలను పట్టుకుంటుంది.

162

ఓ ప్రణయమా! వెలుగుతూన్న వ్యథాదీపాన్ని చేత పుచ్చుకుని నీవు వచ్చిననాడు నీ ముఖం నేను చూడగలను. స్వర్గసుఖంగా నిన్ను తెలుసుకుంటాను.

163

"మీ వెలుగులు ఏనాడో ఒకనాడు చప్పున ఆరిపోతాయి అని పండితులు చెబుతున్నారు" అన్నది మిణుగురు పురుగు నక్షత్రాలతో. నక్షత్రాలు జవాబియ్యలేదు.

164

ఎప్పుడో తెల్లవారుఝాముననే బయలుదేరిన ఆవిహంగము సాయంసంధ్యా సమయాన నా మానగూటికి జేరుకుంటుంది.

165

హంసలబారులు ఆకాశంలోలా, నా భావాలు నా మనస్సులో ఎగిరిపోతూంటాయి.

వాటి రెక్కల చప్పుళ్లు, నేను వింటూంటాను.

163

నదులన్నీ తనకు నీరు సరఫరాచేయటానికే సృష్టింపబడ్డాయి అని పిల్లకాలువ అనుకొని సంతోషిస్తూంటుంది.

167

జగత్తె తన యావద్బాధతో నా అంతరాత్మని ముద్దు పెట్టుకొంది. ఆ బాధని, తీయని పాటలలో తిరిగి ఇచ్చివేయమంది.

168

నన్ను క్రుంగదీస్తూన్నది ఈ రెంటిటిలో ఏది ?—

బయటికి నిర్మొహమాటంగా వచ్చేయటానికి ప్రయత్నిస్తున్న నా అంతరాత్మా ?

లేక—

నాలో ప్రవేశించటానికై నా హృదయద్వారాన్ని తట్టుతూన్న జగత్తుయొక్క అంతరాత్మా ?

169

భావన తన స్వంతపదాలతోనే తనను పోషించుకుంటూ వృద్ధి పొందుతుంది.

170

నా హృదయ కలశాన్ని ఈ నిశ్శబ్దక్షణాలలో ముంచేను. అది ప్రేమతో నిండిపోయింది.

171

నీకు పనిఉంటే ఉండవచ్చు లేకపోతే లేకపోవచ్చు – గాని "మనం కలసి ఏదో ఒకటి చేద్దాం" అని నువ్వు చెప్ప వలసి వచ్చిననాడు, గొడవ ప్రారంభం అవుతుంది.

172

సూర్యకాంతపూవు, పేరు ప్రఖ్యాతులులేని పువ్వుని తన బంధుకోటిలోనిదని చెప్పుకోటానికి సిగ్గుపడింది.

సూర్యుడు ఉదయించి ఆపేరులేని పువ్వుమీద తన మందహాసాన్ని ప్రసరించి "ఏం నా ముద్దుపాపా! కులాసాయేనా ?" అని అడిగేడు.

173

"కర్మమాదిరిగా నన్ను ముందుకు తరుముతూండేది ఏది ?"

"నా వెన్నుమీద స్వారీచేస్తూన్న నా అహనే!"

174

మేఘాలు, దూరానగల కొండల్లో పొంచుండి, నదుల పాత్రలను నింపుతూంటాయి.

175

దారంట నడుచుకుపోతూ, నా కూజాలోని నీళ్ళను జల్లుతూంటాను.

నా ఇంట్లో ఉపయోగానికి మిగిలేవి మాత్రం అతి స్వల్పం.

176

బిందెలోఉన్న నీరు తళతళా మెరుస్తోంది.

సముద్రంలోఉన్న నీరు నైలిమగా ఉన్నది.

స్వల్ప సత్యంలో సుస్పష్టపదాలుఉంటాయి. బ్రహ్మాండ మయిన సత్యంలో బ్రహ్మాండమయిన మౌనం మాత్రం వుంటుంది.

177

నీ చిరునవ్వులు నీ స్వంతభూముల్లో పూచిన పూవులే!
నీ మాటలు నీ స్వంత దేవదారు అడవుల మర్మరధ్వనులే !
గాని నీ హృదయంమాత్రం అందరం ఎరిగిన భామినే !

178

నా అనుంగు బిడ్డలకు నేను ఇచ్చేవి అన్నీ స్వల్పాతి స్వల్పమయినవే. గాని లోకంలో ప్రతి ఒక్కనికోసం విలువైనవి విడిచిపెడతాను.

179

ఓ మానినీ! సముద్రం భూమినివలె, నీ అశ్రుజలం ప్రపంచంయొక్క హృదయంచుట్టూ నిండివుంది.

180

సూర్యరశ్మి చిరునవ్వుతో నన్ను పలుకరిస్తుంది. అతని విషాదసోదరియైన వర్షం నా హృదయంతో మాటాడుతుంది.

181

నా పగటి పూవు తన విస్మృతిచెందిన దళాలను రాల్చివేసింది.

సాయంత్రాన స్మృతి పసిడి ఫలంగా అది పరిపక్వమవుతుంది.

182

తన స్మృతులను అడుగుల చప్పుళ్ళను మౌనంగా వింటూన్న నిశీథిలోని బాటలా నేను ఉన్నాను.

183

సంధ్యా గగనం ఒక గవాక్షంలాగా—ఒక వెలుగుతూన్న దీపం దానివెనుక ఎవరోవేచి ఉన్నట్లూ అగపడుతుంది.

184

మంచి చేయటంలోనే నిమగ్నమయిన వానికి, మంచి వాడుగా ఉండటానికి తీరికచిక్కదు.

185

నేను వర్షజల హీనమైన శరత్కాల మేఘాన్ని నా నిండు తనాన్ని బాగా పండిన వరి కేదారంలో చూసుకుంటున్నాను.

186

వారు అసహ్యించుకొని చంపేసారు. వారిని మానవులు అభినందించేరు. గాని భగవంతుడు సిగ్గిలి, ఆ భయంకర సంస్మృతిని పచ్చగడ్డి క్రింద దాచివేయ తొందర పడుతాడు.

187

మునివ్రేళ్ళు అంటే గతాన్ని విడిచేసిన వ్రేళ్ళు అన్నమాట.

188

అంధకారం వెలుగు కేసి పయనిస్తుంది.
గాని అంధత్వం మృత్యువు కేసి నడుస్తుంది.

189

పెంపుడు కుక్క తనస్థానాన్ని ఆక్రమించటానికి ప్రపంచం పన్నాగం పన్నతోందని అనుమానిస్తుంది.

190

ఓ నా హృదయమా! మెదలకుండా కూర్చో. నీ దుమ్మును మాత్రం లేపకు.

నీ దగ్గరకు ప్రపంచాన్ని దారి కనుగొననీ.

191

తూణీరం రివ్వున పారిపోయేముందు ధనస్సు దాని చెవి దగ్గరకువచ్చి "నీస్వేచ్ఛయే నా స్వేచ్ఛ" అని గొణుగుతుంది.

192

ఓ కలకంఠీ! నీ కలకల నవ్వులో జీవితఝురుల సంగీతం ఉప్పొంగుతూన్నది.

193

తర్కంతో నిండిన మనస్సు అన్నివేపులా పదును కలిగిన అసి వంటిది.

దాన్ని ఉపయోగించిన చేతినే కోసి రక్తాన్ని ప్రవహింప చేస్తుంది.

194

గొప్పవైన తన నక్షత్రాలకన్నా, మానవుడు వెలిగించిన దీపాలనే భగవంతుడు ప్రేమిస్తాడు.

195

ఈ లోకం భయంకర తుపానులతో నిండిన లోకం. దీన్ని సౌందర్యంయొక్క గానంతో లాలించి అదుపులో ఉంచడం జరుగుతూంది.

196

"నా హృదయం నీ ముద్దుల బంగారు భరిణలా ఉన్నది." అంది సూర్యాస్తమయ మేఘం సూర్యునితో.

197

తాకడంవల్ల నీవు చూపివేయవచ్చు.

దూరంగా ఉండడంవల్ల నీవు ఉంచుకోవచ్చు.

198

కీచురాళ్ళరొద, వర్షపుహోరు, గతించిన నా యవ్వనం లోంచివచ్చే కలల మర్మర ధ్వనుల్లా, చీకటిగుండా నా దగ్గరకు వస్తాయి.

199

నక్షత్రాలనన్నిటినీ నష్టపోయిన ఉదయాకాశంతో "నేను మంచు బిందువుని నష్టపోయేను" అంటూ గోల పెడుతుందట పూవు.

200

కాలుతున్న మోడు భగ్గున మంటమండి "ఇదిగో నా పూవు, నా మృత్యుదేవత" అంటూ కేక వేసిందట.

201

కందిరీగ తన ఇరుగున ఉన్న తేనెటీగల పట్టు చాలా చిన్నదని అనుకుంది.

దాని పొరుగున ఉన్నవి ఇంకా చిన్నదాన్ని మరొకటి కట్టమని అతన్ని కోరేయి.

202

"నీ తరంగాలను నేను ఉంచుకోలేనుగాని నీఅడుగుజాడలను మాత్రం నా హృదయంలో ఉంచుకోనీ" అని గట్టు నదితో చెప్పింది.

203

ఈ చిన్నారి భూమి సవ్వడితోనే, సమస్తలోకాల నిశ్శబ్దాన్ని అణచి వేస్తుంది పగలు.

204

ఆ పాట అపారత్వాన్ని వాయువులోనూ, రూపాన్ని పృథివిలోనూ, కవితను పృథివీ వాయువుల్లోనూ అనుభూతి పొందుతుంది. కారణం, దానిపదాలు నడిచే అర్థాన్ని, అంబరాలకు ఎగిరే సంగీతాన్ని సమృద్ధిగా కలిగిఉన్నాయి.

205

సూర్యుడు పశ్చిమాన అస్తమిస్తూండగా అతను ఉదయించే తూర్పుదిశ, మౌనంతో అతనిముందు నుంచుంది.

206

నా ప్రపంచానికి నన్ను తప్పుగా పోనిచ్చి, దానిని నా మీదకు ఎదురు తిరుగనీయకు.

207

పొగడ్త నన్ను అవమానిస్తుంది. కారణం దానికోసం రహస్యంగా యాచిస్తాను.

208

చేయటానికి ఏ పనీ లేనప్పుడు, ఉత్తనే కూచున్నానే అనేబాధ పోయి, శాంతంగాఉన్న సముద్రతీరంలోని సాయం సంధ్యలా, ప్రశాంతత నిర్విచారత చేకూరుగాక.

209

ఓ కన్యామణీ! నీ నిరాడంబరత సరసి వినీలతలా, నీ నిజాయితీ లోతును వ్యక్తంచేస్తోంది.

210

శ్రేష్ఠత ఎప్పుడూ ఒంటరిగా రాదు. అందరితోను సహవాసంగా వస్తుంది.

211

భగవంతుని కుడిచేయి అతి నెమ్మదిఅయింది. గాని ఎడమచేయిమాత్రం మహాభయంకరమైంది.

212

నా సాయంసంధ్య ఏవో క్రొత్త వృక్షాలమధ్యనుంచి వచ్చి, నా వేగుచుక్కలకు తెలియని భాషలో ఏవో మాటాడింది.

213

నిశీథియొక్క చీకటి ఒక సంచీవంటిది. అది ప్రభాత సువర్ణంతో పిగిలిపోతుంది.

214

మన కోరికలు ఇంద్రధనుర్వర్ణాల్ని జీవితంయొక్క ఉత్త పొగమంచుకు, ఆవిర్లకు ఎరువు ఇస్తాయి.

215

తనుప్రసాదించిన పూలనే తిరిగి మానవుని హస్తాలనుంచి కానుకలుగా సంపాదించుకోటానికి భగవంతుడు నిరీక్షిస్తాడు.

216

తమ తమ ప్రశ్నను తెలియచెప్పమని చింతాకులిత భావాలు నన్ను వేధిస్తున్నాయి.

217

ఫలంయొక్క సేవ ఉత్కృష్టమైంది. పూవుయొక్క సేవ అతి మధురమైంది. గాని నా సేవమాత్రం వినమ్రంగా నీడలనిచ్చే ఆకులయొక్క సేవలా ఉండుగాక.

218

ఎచ్చటయినా నీడనిచ్చేడు ద్వీపానికి పయనించటానికి సోమరిగాలులకు నా హృదయం తన తెరచాపలను విప్పింది.

219

మానవులు క్రూరులుగాని మానవుడుమాత్రం దయా మయుడు.

220

నన్ను నీ పానపాత్రగా చేసుకొని, నా నిండు హృద యాన్ని నీవు, నీ భక్తకోటీ పరిగ్రహించుగాక!

221

తన ప్రేమను ధరణీకాంత తిరస్కరించగా బాధతో ఉన్న ఏదో దేముని ఆక్రందనలా ఉన్నది ఈ తుపాను.

222

జగద్భాండం కారదు లేకుంటే మరణం పగులు కాదు కాబట్టి.

223

నష్టపడిన ప్రేమచేత జీవితం భాగ్యవంతమయింది.

224

ఓ మిత్రమా! ప్రభాతాన ఏకాంతంగా ఉన్న పర్వతహిమ శిఖరంలా, అత్యున్నతమైన నీ హృదయం తూర్పున సూర్యో దయం అవటంతో నే ప్రకాశించింది.

225

మృత్యు నీటిబుగ్గ జీవిత నిశ్చలజలాన్ని ఆశిస్తుంది.

226

నిన్నుతప్ప సమస్త సంపదలు కలవాళ్ళు, నీవుతప్ప, అన్యమేమీలేనివాళ్ళను చూచి పరిహసిస్తారు ఓ భగవానుడా!

227

జీవితంయొక్క గమనం స్వకీయసంగీతంలోనే విశ్రాంతి అనుభవిస్తుంది.

228

భూమిని తన్నిన తాపులు దుమ్మునిమాత్రమే లేవదీస్తాయి, గాని భూమినుంచి పంటలను లేవదీయలేవు.

229

రాత్రిపూట సముద్రకెరటాలపై తృటికాలం వెలిగి, జాడకూడా కనబడకుండా వెంటనే మాయమయేదీపంవంటిదే మన పేరు ప్రఖ్యాతులు.

230

గులాబీని చూడటానికి కళ్ళు ఉన్నవాణ్ణే దానిముళ్ళను కూడా చూడమను.

231

పక్షికిబంగారు రెక్కలను తగిలించేవంటే, అది ఆకాశంలోకి మరి ఎన్నటికీ ఎగరలేదు.

232

మన మట్టిలో పుట్టిన తామర, అన్యదేశంలోనయినా సరే ఒకేమాదిరిగా వికసిస్తుంది. ఒకే సువాసనా మాధురిమ కలిగిఉంటుంది. మారేదల్లా పేరు ఒక్కటి మాత్రమే.

233

హృదయపు దృష్టిలో దూరం ఎక్కువగా గోచరిస్తుంది.

234

చంద్రుడు తన అందమైన వెన్నెలనంతా ఆకాశానికి ఇచ్చి తన నల్లమచ్చలను మాత్రం తనకే ఉంచుకుంటాడు.

235

“ఉదయం అయింది” అనిచెప్పి దానిని నిన్నటి పేరుతో త్రోసివేయకు. క్రొత్తగా జన్మించి, పేరుపెట్టని శిశువును ప్రథమపర్యాయం చూసినట్లుగానే దానినికూడా చూడుము.

236

పొగ ఆకాశంతోనూ, బూడిద భూమితోనూ, మేం అగ్నిహోత్రుని అన్నదమ్ములం అని గొప్పలు చెప్పుకుంటాయి.

237

“నన్ను విడవకుండా నీ హృదయంలో ఎప్పుడూ ఉంచుకో” అని వర్షబిందువు మల్లియ చెవిలో రహస్యంగా చెప్పింది.

మల్లెపూవు “అయ్యో” అని నిట్టూర్చి నేలమీద రాలి పోయింది.

238

ఓ పిరికి భామల్లారా! నేనంటే భయపడకండి!
నేను ఒక కవిని!

239

నా మనస్సుయొక్క చీకటి నిశ్శబ్దం, కీచురాళ్ళ రొదల సంధ్యాకాంతితో నిండినట్లు అగపడుతూంది.

240

ఓ తారాచువ్వల్లారా! తారలకు మీరుచేసిన అవమానం మిమ్మల్ని వెంబడిస్తూ, తిరిగి భూమిమీదకే వస్తూంది.

241

సాంధ్య ఏకాంతవాసానికి పయనించే నా పగటి ప్రయాణాలన్నిటిలోనూ నాకు తోడుగాఉండి దారి చూపించేవు నీవు.

నీవలా ఎందుకుచేసావో అర్ధరాత్రి ప్రశాంతతద్వారా అర్థం తెలుసుకుందుకు వేచిఉంటాను.

242

ఈ జీవితం భవసాగరాన్ని దాటడానికి నిర్మించుకున్న వంతెన. అక్కడ మనం అందరం ఒకేమాదిరి ఇరుకైన పడవలో కలసుకుంటాం.

మరణంతో మనం ఒడ్డుకుచేరుకొని ఎవరిలోకాలకు వాళ్ళం వెళ్ళిపోతాం.

243

సత్యప్రవాహం తన పొరపాట్ల కాల్వలద్వారానే ప్రవహిస్తుంది.

244

కాలసాగరంపై తీయని ఒకగంట విహారంకోసం నా హృదయం వాచిపోయింది.

245

భూమినుండి తిరిగివచ్చే ఉదయకాంతియొక్క ప్రతిధ్వనే ఆ పక్షి పాట

246

"నన్ను ముద్దుపెట్టుకోడానికి నీకంత గర్వమా?...”అని ఉదయకాంతి పచ్చని గంగరావిపూవుని అడిగింది.

247

"నిన్ను ఏవిధంగా కీర్తించి ఆరాధించేది ఓ నా సూర్య భగవానుడా ?" అని చిన్నారి పూబాల అడిగింది. "నీ నిర్మలత యొక్క మౌనంతోనే" అని సూర్యుడు జవాబిచ్చేడు.

248

మానవుడు పశువుగా దిగజారిననాడు పశువుకంటే కూడా అధమాధముడు.

249

మెరుపుతీగలచేత ముద్దుపెట్టుకో బడినప్పుడు కారు మేఘాలు, స్వర్గలోక దివ్యప్రసూనాలుగా మారుతాయి.

250

పమనుగాఉన్న కత్తిఅంచు మొద్దుగాఉన్న పిడినిచూసి ఎగతాళిచేయనీకు.

251

నిశీథి నిశ్శబ్దం, గాఢంగా వెలుగుతూన్న దీపంలా, దాని పాలవెల్లువ కాంతిలో వెలుగుతోంది.

252

ఆనందం వెల్లివిరుస్తూన్న జీవిత దీవిచుట్టూ, మృత్యు సాగరంయొక్క అవిరళ సంగీతం అహోరాత్రాలు పొంగి పొరలుతూంటుంది.

253

కొండలే రేకులు కాగలిగి, సూర్యకాంతిని గ్రోలుతూన్న ఈ పర్వతము పూవులాలేదూ ?

254

యాదార్థంయొక్క అర్థాన్ని తప్పుగాచదివి, తప్పుచోట ఒత్తిపలికితే అయదార్థమవుతుంది.

255

వాయు జలాల అనుగ్రహం ఉన్న పడవలాగ, ఓ నా హృదయమా ! నీ సౌందర్యాన్ని ప్రపంచంయొక్క నడకతీరు నుంచి తెలుసుకో !

256

కళ్ళు తమ దృష్టికి గర్వపడవుకాని తమకళ్ళద్దాలను చూసి గర్వపడతాయి.

257

నేను ఈ నా చిన్ని ప్రపంచంలో జీవితం గడుపుతున్నాను. చిన్నదైన దీన్ని ఇంకా చిన్నదిగా చేయటానికి భయపడుతున్నాను.

నన్ను నీలోకానికి లేవనెత్తి ఉద్ధరించు. నా కున్న స్వేచ్ఛ అంతా సంతోసంతో హరించిపోనీ.

258

కపటహృదయుడు అధికారంలో ఎంత ఉన్నతస్థితికి వెళ్ళినా, నిజాయితీలో మాత్రం నీచస్థితిలోనే ఉండిపోతాడు.

259

నా హృదయం అలలజోలపాటతో ఉల్లాసంగా ఉన్న ఈ యువప్రపంచాన్ని లాలిద్దామని కుతూహలపడుతోంది.

260

దాపిప్రక్కనున్న పసికికా ! తారను ప్రేమిస్తే నీ కలలన్నీ పూలుగా వికసిస్తాయి.

261

పదునైన కత్తిలా, నీ సంగీతం అంగిళి హోరును చీల్చి గుండెలవరకు దూసుకుపోనీ.

263

ఈ చెట్టుయొక్క ఒణుకుతూన్న లేతఆకులు, పసిపాప వ్రేళ్ళలా నా హృదయాన్ని స్పృశిస్తున్నాయి.

263

నా అంతరాత్మయొక్క ఈ విషాదం పెళ్ళికుమార్తె ముసుగులాఉంది.

అది రాత్రిపూట తొలగించబడేందుకై నిరీక్షిస్తూంటుంది.

264

బుద్ధిలేని ఈ పూవు బుగ్గిలోపడిఉంది.
అది సీతాకోకచిలుకయొక్క మార్గాన్ని వెదకింది.

265

నేను రహదార్ల ప్రపంచంలో ఉన్నాను. రాత్రి ప్రవేశించింది. ఓ గృహప్రపంచమా! నీ ద్వారం తెరచుము.

266

నీ పగటిపూటపాటలన్నీ పాడేశాను—సంధ్యాసమయంలో నీ దీపాన్ని తుపాను దారంట తీసుకుని వెళ్ళటానికి నాకు అనుమతి ఇప్పించు.

267

ఇంటిలోనికి రమ్మనమని నేను నిన్ను కోరను.

ఓ నా ప్రేయసీ! నా అనంతమైన ఏకాంతంలోనికి మాత్రం విచ్చేయుము.

268

జననం మాదిరిగానే మరణంకూడా జీవితానికి చెందినదే!

నడకఅంటే, కేవలం అడుగుమీదికి ఎత్తడమే కాకుండా, ఎత్తిన అడుగుని నేలకు దించటంలోనూ కలిసిఉంది.

269

పూలలోనూ, సూర్యరశ్మిలోనూ నీ రహస్య నివేదనల అర్థం ఏమిటో నేను తెలుసుకోగలిగేను—బాధలోనూ, మృత్యువులోనూ నీయొక్క మాటల అర్థాన్ని తెలుసుకోవటం నాకు బోధించు!

270

రాత్రిపూవు ఆలస్యంగా లేచేసరికి ఉదయం ఆమెను ముద్దుపెట్టుకుంది.

ఆమె గజగజ వణికి నిట్టూర్చి నేలకు ఒరిగిపోయింది.

271

సమస్త చరాచరాల విషాదంగుండా జగదంబ జోల పాట నేను వింటున్నాను.

272

ఓ ధరిత్రీ! నేను నీదరికి ఒక ఆగంతుకునిగా వచ్చేను— అతిథిగా నీ గృహంలో వసించేను. స్నేహితుడుగా నీ గుమ్మాన్ని తిరిగి వదలిపెట్టి వెళ్ళిపోతున్నా.

273

సూర్యాస్తమయానంతరం మిగిలిన వెలుగు వస్తూన్న నక్షత్రాల నిశ్శబ్దపు టంచులలో మిళిత మయ్యేటట్లు, నేను పోయిన తరువాత నా భావనలన్నీ నిన్ను చేరుకాక !

274

ఓ విశ్రాంతి శుక్ర నక్షత్రమా ! నా హృదయంలో వెలుగు తరుపరే ప్రణయాన్ని గురించి నిశాకాంత నాతో గుసగుసలాడనీ.

275

నేను గాఢాంధకారంలో ఉన్న ఒక శిశువును—

ఓ అమ్మా ! నీకోసం రాత్రి అనే ముసుగులో నా చేతులు చాపుతున్నాను.

276

పనిచేయవలసిన రోజు పూర్తి అయింది. అమ్మా! నీ చేతులలో నా ముఖాన్ని దాచివేయుము.

నన్ను హాయిగా కలలు గననీ!

277

సంయోగ దీపము చాలాసేపు వెలుగుతుంది. వియోగ సమయాన లిప్తలో ఆరిపోతుంది.

278

నేను చనిపోయాక నీ గభీరమౌనంలో "నేను ప్రేమించాను సుమా!" అన్న నా ఒక్కమాటా ఉంచాలి, ఓ ప్రపంచమా!

279

ఈ లోకాన్ని ప్రేమించినప్పుడే ఈ లోకంలో జీవించి ఉంటాం.

280

మరణించినవారు శాశ్వతమైన కీర్తిని తీసుకోనీగాని బ్రతికున్నవారు మాత్రం శాశ్వతమైన ప్రేమను పొందుదురు గాక.

281

తెల్లవారుఝామునే మసక వెలుగులో సగం నిద్రమత్తుతో లేచి, తల్లినిచూసి, బోసినవ్వునవ్వి, వెన్వెంటనే నిద్రపోయే శిశువు మాదిరిగా నేను నిన్నుచూసేను.

282

జీవితం అక్షయం అని రూఢిగా తెలుసుకునేందుకు నేను మళ్ళామళ్ళా మరణిస్తూనే ఉంటాను.

283

ప్రజా సమూహంతో కలిసి రోడ్డుమీదుంచి వెళుతూన్న నేను, మేడమీది వసారాలో వెలుగుతూన్న నీ చిరునగవును

చూసేను. మహదానందంతో పాటపాడుకుంటూ, సర్వజగత్తును మరచిపోయాను.

284

ద్రాక్షాసవంతో నిండిన పాత్రలా నిండుగా ఉన్న మధుర జీవితమే ప్రేమ.

285

వారు వాళ్ళ దేవాలయాల్లోనే వాళ్ళ స్వంత దీపాలను వెలిగించి, వాళ్ళ పాటలనే పాడుతారు.

గాని పక్షులుమాత్రం నీయొక్క ప్రభాత కాంతిలో, నీ నామాన్నే గానంచేస్తాయి – ఎంచేతనంటే నీ నామమే బ్రహ్మానందం.

286

నా హృదయాన్ని పాటలతో నింపి వేయటానికి నీ మౌనం మధ్యనుంచి నన్ను నడిపించి తీసుకు వెళ్ళు.

287

తుస్ బుస్‌మనే బాణసంచా లోకంలో జీవించ ఇష్టపడే వారిని అక్కడనే జీవించనీ.

గాని నా హృదయంమాత్రం నీ నక్షత్రాల లోకాల్ని కాంక్షిస్తూంది.

288

లోతు లెరుగని అంబోధిలా నా ప్రణయబాధ నాజీవితం చుట్టూ తిరుగుతూ పాడింది.

ప్రణయానందం మాత్రం పుష్పవనాల్లోంచి పక్షులలా హృదయంగమంగా పాడింది.

289

నీవు కోరుకున్నపుడు దీపాన్ని ఆర్పివేయము—
నీ గాఢాంధకారాన్ని నేను తెలుసుకుని ప్రేమిస్తాను.

290

దినాంతమున నీముందు నేను నిలబడిఉండగా, నా గాయాల మచ్చలు నీవు చూచెదవు. అప్పుడు నాకు గాయాలున్నట్లూ, కొన్ని పూడుతూన్నట్లూ నీవు తెలుసుకుంటావు.

291

ఏదోరోజున, మరోప్రపంచంయొక్క సూర్యోదయంలో నీగురించి ఈవిధంగా పాడుతాను."నిన్ను ఇంతకుముందే భూమి వెలుగులోనూ, మానవుని ప్రేమలోనూ సందర్శించేను."

292

మిగతారోజులనుంచి మేఘాలు తేలియాడుతూ నా జీవితంలోకి వస్తాయి. ఆ రావడం వర్షించటానికి కాదు! తుపానులు లేవదీయటానికి కాదు! నా సూర్యాస్తమయ ఆకాశానికి రంగువేకూర్చటానికే మాత్రమే వస్తాయి.

293

సత్యము తనమీదకు తనే అల్లకల్లోలాన్ని లేవదీసుకొని తద్వారా తన బీజాల్ని అంతటా విస్తరింపచేస్తుంది.

294

గతరాత్రి తుపాను ఈనాటి ఉదయానికి బంగారు ప్రశాంతితో పట్టాభిషేకం చేసింది.

295

నిజం దాని చివరిమాటతో బయటకువచ్చేటట్లు కన బడుతుంది. గాని చివరిమాట మరోమాటను కంటూనే ఉంటుంది !

296

ఎవని కీర్తిఅయితే అతని నిజాయితీని కప్పిపుచ్చి ప్రకాశించదో, అతడే ధన్యుడు.

297

సూర్యుడు రావడంతోనే పొగమంచు కరిగి మైమరచినట్లు, నీ నామములోని మాధుర్యంతో నా హృదయం నిండగానే నన్ను నేను మరచిపోతాను.

298

నీరవ నిశీథికి, మాతృసౌందర్యంఉంది. సందడిగాఉన్న పగటికి, శిశుసౌందర్యంఉంది.

299

మానవుడు మందహాసంచేయగానే లోకం ప్రేమించింది. అతడు పకపక నవ్వగానే భయకంపిత అయింది.

300

మానవుడు పరిపక్వమయిన జ్ఞానదశలో తన బాల్యాన్ని తిరిగి పొందేవరకు భగవానుడు వేచిఉంటాడు.

301

నీ ప్రేమే ఈ ప్రపంచరూపాన్ని పొందిందని నన్ను అనుభూతి పొందనీ. అప్పుడే నా ప్రేమ దానికి సహాయంచేస్తుంది.

302

నా హృదయపు చలికాలపు రోజులపై నీ సూర్యరశ్మి చిరునవ్వులు చిందుతుంది. అప్పుడు వసంతకాల పుష్పాలను గూర్చి ఏమాత్రం సంశయం పెట్టుకోదు.

303

భగవానుడు ఆద్యంతాలుగల మానవుణ్ణి ప్రేమతో ముద్దుపెట్టుకుంటాడు.

మానవుడు ప్రేమతో ఆ అనంతుడైన భగవానుని ముద్దుపెట్టుకుంటాడు.

304

ఫలించని సంవత్సరాలయొక్క ఎడారి భూములను దాటుకుంటూ, ఫలించే క్షణాన్ని చేరుకోటానికై నీవు వెళుతున్నావు.

305

భగవానుని మౌనం, మానవుని భావనలను మాటలలోకి పరిపక్వంచేస్తుంది.

306

ఓ అనంత యాత్రికుడా! నీ అడుగుల గురుతులు నా పాటల బాటమీదుగా నీకు అగపడతాయి.

307

ఓ జగత్పితా! నిన్ను నేను అవమానించనీకు. నీ మహిమలను నీవు నీ బిడ్డలలో ప్రదర్శిస్తావు.

308

ఈరోజు నిరుత్సాహంగాఉన్నది. కొప్పడుతున్న మేఘముల అడుగునఉన్న వెలుగు, దెబ్బలుతిని ఏడుస్తూన్న బిడ్డలా ఉన్నది. గాలియొక్క హోరు క్షతగాత్రమైన లోకం ఆక్రంద నలా ఉన్నది. వాతావరణం ఇలాఉన్నప్పటికీ నా చెలికాడైన భగవానుని చెంతచేరేందుకై నేను ప్రయాణం చేస్తూనే ఉంటాను.

309

ఓ నిండు జాబిల్లీ ! ఈరాత్రి తాటియాకులలో సందడీ, సాగరంలో పొంగూ, ఉల్లాసంతో ఉన్న విశ్వహృదయ స్పంద నంలా నిండుగా ఉన్నాయి. బాధిస్తూన్న ప్రణయరహస్యాన్ని, తెలియరాని ఏ ఆకాశపథాన నీ గభీరమౌనంలో మోసుకు పోయేవు ?

310

నేను ఒక తారకను, ఒకకాంతి దీవిని కలగంటున్నాను. అక్కడ నేను జన్మిస్తాను. చురుకైనదాని విశ్రాంతి లోతుల్లో హేమంత సూర్యకాంతిలో వరిభూమిమాదిరి. నా జీవిత కర్త వ్యాలను చకచకా పూర్తిచేసుకుంటాను.

311

వర్షంలో తడుస్తూన్నమట్టి వాసన కోటానుకోట్ల మూగజీవుల నిశ్శబ్ద సంకీర్తనలా పైకి లేస్తోంది.

312

ప్రేమ ఓడిపోతుందన్న విషయాన్ని నిజంక్రింద మనం అంగీకరించలేము.

313

మన అంతరాత్మ సంపాదనను మృత్యువు ఎన్నటికీ దోచుకోలేదని ఒకానొకరోజున గ్రహిస్తాం. అంతరాత్మ సంపాదించుకొన్నది దానిలో కలసిపోయే ఉంటాయి గాని విడిగా వుండవు.

314

భగవానుడు అతని సజ్జలో నా గత జీవితపు పూలను వాడనీయకుండా నిత్యనూతనంగా ఉంచి, నా జీవిత సాయం సంధ్యలో నా దరికి తీసుకువస్తాడు.

315

నా జీవిత తంత్రుల నన్నీ శృతిచేసినప్పుడు, ఓ గురు దేవా! నీ ప్రతిస్పర్శతోనూ, ప్రణయగానం వెల్లుబుకుతోంది.

316

ఓ ప్రభూ! నన్ను యదార్థంగా జీవించనీ. అందువలన మరణంకూడా యదార్థమవుతుంది నాకు.

317

మానవచరిత్ర, పరాభవింపబడ్డ మానవుని విజయాన్ని కాంక్షిస్తూ ఓర్మితో వేచియుంటుంది.

318

పంటకోసిన వెనుక ఒంటరిగా ఉన్న పొలంమీద ఉదయ సుందరి ఉల్లాసహాసంలా, నా హృదయంపై నీ దివ్యదృష్టిని అనుభూతి పొందుతున్నాను.

319

తప్పెటలు మ్రోగిస్తూ ఉప్పొంగిపోతూన్న ఈ ఆనంద సాగరంలో, పాటల దీవికోసం నేను ఉవ్విళ్లూరుతూంటాను.

320

సూర్యాస్తమయ సంగీతంతోనూ, గాఢాంధకారాన్ని ఉద్దేశించి గంభీరమైన ధ్యానశ్లోకం పఠించడంతోనూ, రాత్రి యొక్క ప్రవేశం జరుగుతుంది.

321

నేను ఉన్నతశిఖరాన్ని అధిరోహించేను. కొరడుకట్టించే మంచుతో నిస్సారమైన ఆకీర్తిశిఖరంమీద నాకు ఏ ఆశ్రయం కనబడలేదు. జీవితసస్యం బంగారుజ్ఞానం క్రింద పరిపక్వంఅయ్యే ఆ ప్రశాంత లోయలోనికి వెలుగు క్షీణించకమునుపే దారి చూపి నన్ను తీసుకువెళ్ళుము ఓ దయామయా!

322

ఈ సంధ్యాచీకటిలో వస్తువులన్నీ చిత్రవిచిత్రాకృతులతో గోచరిస్తున్నాయి. చీకటిలో దృష్టిగోచరంగాని అడుగు భాగాలుగల గోపురాగ్రాలు, వృక్షాగ్రాలు, సిరామచ్చల్లా ఉన్నాయి. సూర్యోదయంకోసం నేను వేచిఉండి, నీయొక్క నగరాన్ని ఉదయకాంతిలో తిలకిస్తాను.

323

నేను బాధపడి, నిరాశచెంది, మృత్యువుని తెలుసుకున్నాను.

ఈ మహాప్రపంచంలో ఉన్నందుకు నేను చాలా ఆనందిస్తున్నాను.

324

నా జీవితంలో కఠినమైనవి, నగ్నమయినవి, నిశ్శబ్దమైనవి అయిన ప్రదేశాలు కొన్ని ఉన్నాయి. తీరికచిక్కని నా రోజులకు, గాలీ వెలుతురూ ప్రసాదించే ఆరుబయటిప్రదేశాలు అవే.

325

నన్ను వెన్నంటుతూ మరణాన్ని కష్టసాధ్యం చేస్తూన్న, నిష్ఫలమైన నా గతజీవితంనుంచి నాకు విముక్తి ప్రసాదించు.

326

"నీ ప్రేమలో నాకు సంపూర్ణవిశ్వాసముంది—" ఇదే నా చివరిమాట !

—o—

# రవీంద్ర సాహిత్యం

| | | |
|---|---|---|
| గోరా | ... | 7-50 |
| త్యాగఫలము | ... | 5-00 |
| పడవమునక | ... | 5-00 |
| చోఖేర్ బాలి | ... | 5-00 |
| ఇంటా - బయట | ... | 4-50 |
| ఆదర్శ ప్రేమ | ... | 5-00 |
| రవీంద్ర నాటకావళి | ... | 5-00 |
| జీవితస్మృతులు | ... | 3-75 |
| సాధన | ... | 2-00 |
| గీతాంజలి | ... | 2-00 |
| అరూప రత్నం | ... | 1-75 |
| ఉత్తమ ఇల్లాలు | ... | 1-50 |
| కిరణ్మయి | ... | 1-50 |
| వందిని | ... | 1-50 |
| ముక్త ధార | ... | 1-50 |
| వటీర్ పూజ | ... | 1-50 |
| సన్యాసి | ... | 1-50 |
| పోస్టాఫీసు | ... | 1-00 |
| మాలిని | ... | 1-00 |
| బలిదానము | ... | 1-00 |
| రాజు - రాణి | ... | 1-00 |
| రవి కిరణాలు | ... | 1-50 |
| నా జన్మ భూమి | ... | 1-50 |
| ప్రేమకానుక | ... | 1-50 |
| లేబరేటరి | ... | 1-50 |
| రవీంద్ర దర్శనం | ... | 1-50 |
| పసి పాపల దరహాసం | ... | 1-50 |

ప్రతులకు

**జయంతి పబ్లికేషన్సు**

బిసెంట్ రోడ్డు :: విజయవాడ - 2



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A120B150 |
| పుస్తకం పేరు | లేతకిరంణాలు |
| తారీఖు | 29-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 6,8ci |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Hragini |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |